# చైర్మన్‌తో ముఖాముఖి





నూకారపు సూర్యప్రకాశరావు

చైర్మన్, సూర్య తెలుగు దిన పత్రిక

**ప్ర: ఇంధనం, నీటివనరుల కొరత తీవ్రస్థాయిలో ఉన్నాయి. రోజురోజుకూ సహజవనరులు తరిగిపోతున్నాయి. జనాభా మాత్రం రెట్టింపవుతోంది. రాబోయే తరం ఊహించుకుంటేనే భయం వేస్తోంది. సౌరవిద్యుత్ పట్ల ఇంకా ప్రజలలో పూర్తి స్థాయి అవగాహన లేదు. పవన విద్యుత్ వలన కలిగే ఉపయోగాలు కూడా జనాలకు తెలియదు. జనాలకు అర్థం అయ్యేలా అవగాహన కల్పిస్తే బాగుంటుంది?**

– ఎన్.పార్వతి, హైదరాబాద్

**జ:** సౌరవిద్యుత్ ఉత్పాదనవల్ల అనేక సౌలభ్యాలు ఉన్నాయి. సౌరశక్తి పుష్కలం... అనంతం. కాబట్టి, ఎక్కువ తక్కువ వంటి వినియోగ సమస్యలు ఎదురు కావు. వాడుకున్నవారికి వాడుకున్నంత. ప్రస్తుతం దేశంలో 65 శాతం విద్యుత్తు శిలాజ ఇంధనాల ద్వారానే ఉత్పత్తి అవుతోంది. ఈ పరిస్థితి ఇకముందూ కొనసాగే అవకాశముంది. భవిష్యత్తులో శిలాజ ఇంధనాలు తరిగిపోతే విద్యుత్ కష్టాలు అనివార్యమవుతాయి. అందువల్ల విద్యుత్ సుస్థిరతకు పునరుత్పాదక ఇంధన వనరుల వినియోగం తప్పనిసరి. అందుకు పవన, సౌర విద్యుత్తులే ఇప్పుడున్న ప్రత్యామ్నాయాలు. పవన విద్యుత్తులో ప్రపంచంలో మనదేశం అయిదో స్థానంలో ఉంది. సుమారు 23 వేల మెగావాట్ల పవన విద్యుత్ స్థాపక సామర్థ్యం దేశంలో ఉంది. అలాగే 750 గిగావాట్ల సౌర విద్యుత్ ఉత్పాదనకు అవ కాశం ఉందన్నది అంచనా. సూర్యకిరణాల వేడి కారణంగా ఆరుబయట ఆరేసిన తడి వస్త్రాలు పొడి అవుతాయి. అలాగే, సౌరఫలకాలు సౌరశక్తిని పీల్చుకుని విద్యుత్తును ఉత్పత్తి చేస్తాయి. వేడి నీటి కోసం సౌరశక్తి వాటర్ హీటర్స్ గురించి మనకు తెలిసిందే. కర్బన ఉద్గారాలతో పర్యావరణనికి ఏర్పడుతున్న ముప్పు నేపథ్యంలో పునరుత్పాదక ఇంధన వనరులను వినియోగించుకోవడంపై ఇప్పుడు అందరి దృష్టి పడింది. 2008 జూన్‌లోనే నాటి ప్రధాని మన్మోహన్ సింగ్ వాతావరణ మార్పులను దృష్టిలో పెట్టుకుని జాతీయ కార్యాచరణ ప్రణళికను ఆవిష్కరించారు. అందులో తొలి ప్రాధాన్యం సౌర విద్యుత్ ఉత్పాదనకు ఇచ్చారు. జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ సౌర విద్యుత్ మిషన్‌ను ఏర్పాటు చేశారు. కాకపోతే, అప్పటి 20 వేల మెగావాట్ల లక్ష్యం ఇప్పుడు లక్ష మెగావాట్లు అయింది.

**జ:** సర్కారియా కమిషన్ సిఫార్సులను ఖాతరు చేయకుండా ట్రైబ్యునల్ ఏర్పాటులో కేంద్రప్రభుత్వ జాప్యం, తీర్పు ఇవ్వడంలో ఆలస్యం సర్వసాధారణమైపోయాయి. సభ్య రాష్ట్రాలకు ట్రైబ్యునల్ కేటాయించిన కృష్ణా జలాల విడుదల, వినియోగాన్ని నియంత్రించి, క్రమబద్ధీకరించడానికి ట్రైబ్యునల్-2 ఒక అంతర్రాష్ట్ర సంస్థను ఏర్పాటు చేసింది. అలా ఒక నియంత్రణ సంస్థను ఏర్పాటుచేసే అధికారం 1956నాటి చట్టంలోని విభాగం-6 ప్రకారం కేంద్రప్రభుత్వానికి ఉంటుందేకాని, ట్రైబ్యునల్‌కి ఉండదని రాష్ట్రాలు అభ్యంతరం తెలియజేశాయి. అదీగాక, అవసరమైన సిబ్బంది, విధులతోపాటు నేరాలకు శిక్ష విధించే అధికారాన్ని కట్టబెట్టినప్పుడే కృష్ణా జలాల విభజన అమలు బోర్డు సమర్థంగా పనిచేయగలుగుతుంది. ప్రస్తుతం అటువంటి అధికారాలు, అవసరమైన సిబ్బంది లేనందువల్ల ఆ బోర్డు సమర్థంగా తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వహించలేకపోతోంది. ట్రైబ్యునళ్ల తీర్పులు అమలులోకి రావాలంటే కేంద్రసర్కారు చొరవ ఎంతో కీలకం. నదీజలాల వివాదాలకు సంబంధించిన సర్కారియా కమిషన్ సిఫార్సులను కేంద్రం కట్టుదిట్టంగా అమలుపరచాలి. నిర్ణీత కాలంలో ట్రైబ్యునళ్లు తీర్పులు ఇచ్చేలా చేసి, వాటిని కార్యాచరణ దిశగా నడిపించాలి. కృష్ణాజలాల విభజన అమలుకు సంస్థను చట్టం ప్రకారం కేంద్రప్రభుత్వం నియమించి, దానికి అవసరమైన సిబ్బందిని, నిధులను, నేరాలకు తగిన శిక్షలను విధించే అధికారాలను సమకూర్చి, ఆ సంస్థను బలోపేతం చేయాలి. ప్రస్తుతం ట్రైబ్యునళ్ల పరిశీలనలు, విచారణలు సుప్రీంకోర్టులో వాద, ప్రతివాదాలు ఒక వారం జరిగితే మూడు, నాలుగు నెలలు వాయిదాపడి, తీరిగ్గా జరుగుతున్నాయి. దీనివల్ల నదీజల వివాదాలు ఎన్నేళ్లు గడచినా ముడివడక కొనసాగుతూనే ఉన్నాయి. ఈ వివాదాల పరిష్కారం ఆలస్యమైనకొద్దీ రాష్ట్రాల మధ్య స్పర్థలు రగులుతూనే ఉంటాయి. న్యాయ నిర్ణయంలోని జాప్యం, న్యాయ నిరాకరణతో సమానమన్నది న్యాయశాస్త్రంలోని ముఖ్యసూత్రం. కాబట్టి, సుప్రీంకోర్టు, కేంద్రప్రభుత్వం, ట్రైబ్యునళ్లు ఈ న్యాయసూత్రాన్ని పాటించి, నదీజల వివాదాలను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించినప్పుడే రాష్ట్రాల మధ్య సామరస్యం, సుహృద్భావం ఏర్పడి, దేశం ప్రగతిపథంలో పయనిస్తుంది.

**ప్ర: నోట్ల రద్దుతో ముందు ముందు ప్రయోజనాలు ఎన్ని ఉన్నా...ప్రస్తుతం మాత్రం ఎక్కువగా అతివలు కష్టాలపాలవుతున్నారు. ఢిల్లీ పెద్దలకు ఇవన్నీ చిన్న విషయాలు...దానికితోడు చంద్రబాబులాంటి బాధ్యతాయుత నేతలు కూడా పెద్దనోట్లను తానే రద్దుచేయించినట్లు గొప్పగా చెప్పుకుంటున్నారు...నగదు రహిత లావాదేవీలకు రమ్మని చాలా ఈజీగా సూచనలు ఇస్తున్నారు...ఇవన్నీ అమలులో సాధ్యమయ్యేవేనా?**

–ఎన్.గోపీకిషన్, సురారం

**జ:** బాధ్యతాయుతమైన స్థానాల్లో ఉండే పెద్దలు ఆచి తూచి మాట్లాడాలంటారు. లేకపోతే అభాసుపాలవుతారు. మోడీ ప్రభుత్వం పెద్ద నోట్లను రద్దు చేసిన వెంటనే ఏపి సిఎం చంద్రబాబు స్వాగతించారు. పెద్దనోట్లను రద్దు చేయాలని తానెప్పుడో మోడీకి లేఖ రాసినట్లు ఆయన గొప్ప కబుర్లు చెప్పారు. నోట్లరద్దుతో చంద్రబాబు అనేక సార్లు మాటలు మార్చారు. ప్రజలు ఇక్కట్లు పడుతున్నారన్నారు. రెండు వేల రూపాయల నోట్లనూ రద్దు చేయాలన్నారు. నగదును సరిగా పంపిణీ చేయడం లేదంటూ బ్యాంకు ఉద్యోగులపై మండిపడ్డారు. కరెన్సీ కష్టాలపై ప్రతిరోజూ సమీక్షలు చేస్తూ సలహాలు ఇస్తున్నారు. చివరకు ఆయన ఏమి ఏమి మాట్లాడుతున్నారో తెలియడం లేదని అధికారులు అయోమయంలో పడుతున్నారు. బ్యాంకర్లపై చంద్రబాబు చేసిన వ్యాఖ్యలపై బ్యాంకు ఉద్యోగుల సంఘాలు నిరసన వ్యక్తం చేస్తున్నాయి. కీలక పదవుల్లో ఉండేవారు ఆచితూచి మాట్లాడకుంటే అవస్థలు తప్పవు మరి.

## మెయిల్ అడ్రస్

SPR publications, Surya Soudha, Plot.No: 185,
M.C.H. NO.258/1/185, siddi vinayaka nagar,
Chandanayak Thanda, Madhapur, Opp: Hi-Tech City, Hyderabad - 500 072

# లెజెండ్



కెమిస్ట్రీ రంగంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చి శాస్త్రీయ జ్ఞానాన్ని సామాన్య మానవుని ఉపయోగానికి తేవడమే కాక, సైన్సు సామాన్య ప్రజలలో వ్యాప్తికి నిరంతరం కృషిసల్పిన గొప్పవ్యక్తి హంఫ్రీడేవీ, సామన్య కుటుంబంలో జన్మించి, చదువుకోవడానికి, డిగ్రీలు పొందడానికి అవకాశం లేకపోయినా, తన స్వయం ప్రతిభ ద్వారా సైన్సు పురోగతికి ఎంతగానో తోడ్పడ్డాడు.

## సేఫ్టీల్యాంప్‌కు ఊపిరిపోసిన మహనీయుడు

### నేడు హంఫ్రీడేవీ వర్థంతి

హంఫ్రీడేవీ ఇంగ్లండులోని కార్నివాల్‌లో పెన్‌జన్స్‌లో 1778 డిసెంబరు 17న జన్మించాడు. ఒక పేద వడ్రంగి కుటుంబంలో జన్మించిన డేవీ ఎలిమెంటరీ స్కూలుకు మించి చదువుకొనే అవకాశం లేకపోయింది. ఒక ఫార్మసిస్టుగా మందుల దుకాణంలో చేరినప్పటికీ అతని జ్ఞానతృష్ణ చల్లారలేదు. తనకి తీరిక వున్నప్పుడల్లా చాలా విస్తృతంగా వివిధ విషయాలు చదివాడు. కెమిస్ట్రీ అతనిని ఎంతగానో ఆకర్షించింది. ఎంతో మందితో పరిచయం పెంచుకున్నాడు. జేమ్స్‌వాట్ కొడుకుతో పరిచయం అయింది. అతను డేవీని రాయల్ సొసైటీ అధ్యక్షునికి పరిచయం చేశాడు. క్రొత్త కొత్త విషయాలు కనుగొంటూ, తన 20వ ఏటనే మెడికల్ న్యూమాటిక్స్ సంస్థకు డెరెక్టర్ అయ్యాడు.

**లాఫింగ్ గ్యాస్:** స్వయం కృషితో పైకి వచ్చిన డేవీ 1799లో నైట్రస్ ఆక్సైడన్ తయారు చేయడమేకాక, దానిని కొంత తాను పీల్చి ఫలితాలు చూశాడు. అది పీల్చగానే తనకు నొప్పి తెలియకుండా పోయింది. చిన్న చిన్న ఆపరేషనులు చేయడానికి ఈ నైట్రస్ ఆక్సైడ్ పీలిస్తే, చాలా ఉపయోగకరం అని అతను చెప్పినప్పటికీ, వెంటనే దానిని ఎవరూ అనుసరించలేదు. అయినా అతనికి దేశ విదేశాలలో ఖ్యాతి తెచ్చింది. తరువాత 50 సంవత్సరాలకు డేవీ చెప్పిన "లాఫింగ్ గ్యాస్" ను హోరాన్ వెల్స్ అనే అమెరికన్ దంతవైద్యుడు పళ్ళు పీకడానికి ఉపయోగించి ప్రచారంలోకి తెచ్చాడు.

**రాయల్ సంస్థలో ఆకట్టుకున్న ఉపన్యాసం:** లండనులో ప్రారంభమైన రాయల్ ఇన్‌స్టిట్యూషన్‌లో యువకుడైన డేవీని కెమిస్ట్రీపై ఉపన్యాసాలు యివ్వమని ఆహ్వానించారు. అత్యంత ప్రతిభావంతుడు డేవీ ఆ రాయల్ సంస్థలో యిచ్చిన ఉపన్యాసాలు ఎంతగానో ఆకర్షించాయి. డేవీని ఆసంస్థలో ప్రొఫెసర్‌గా నియమించారు. ఇది అతని విశిష్టతకు అతని పరిశోధనల ప్రాధాన్యతకు తార్కాణం. కెమిస్ట్రీని నిత్య జీవితానికి అన్వయించాలని పూనుకొన్నాడు. పది సంవత్సరాల పాటు అగ్రికల్చర్ కెమిస్ట్రీపై ఉపన్యాసాలు యివ్వడమే కాక, కెమికల్ ఫెర్టిలైజర్స్ రూపొందించడంలో ప్రముఖపాత్ర వహించాడు.

ఎలక్ట్రిసిటీని కెమిస్ట్రీ రంగంలో ఉపయోగించి విప్లవాత్మకమైన విజయాలు సాధించాడు. అతి మంచి ఎలక్ట్రికల్ బ్యాటరీ అతని వద్ద ఉండేది. దాని సహాయంతో అతను అల్కలీలు వంటి కెమికల్ కాంపౌండ్ కనుగొన్నాడు. ఆక్సిజన్, మెటాలిక్ బేసెస్ కలవడం వలన ఇవి ఏర్పడుతున్నాయని కనిపెట్టాడు. ఎలక్ట్రిసిటీ సహాయంతో కెమికల్ కాంపౌండులను విడగొట్టాడు. దానితో ఎలిమెంటరీ మెటల్స్‌ను పొటాషియం, సోడియం, మెగ్నీషియం, కాల్షియం, సోనియం, బేరియం వంటివి కనుగొని విప్లవాత్మకమైన మార్పులు తెచ్చాడు. డేవీ 47 ఎలిమెంటులను కనుగొని చరిత్ర సృష్టించాడు. డేవీ కనుగొన్న మరో గొప్ప విషయం క్లోరిన్ ఒక ఎలిమెంటు అని. అంతేకాదు, హైడ్రోక్లోరిక్ యాసిడ్ అనేది క్లోరిన్. హైడ్రోజన్ యొక్క కాంపౌండు అని నిరూపించాడు.

ఈ రకంగా చెప్పడం ఆనాడు ప్రచారంలో వున్న అభిప్రాయాలకు భిన్నంగా వుంది. కొందరు అతని ప్రతిభ చూసి ఓర్వలేకపోయారు. కాని, నిజం అనేది దాచేస్తే దాగని సత్యం. డేవి విమర్శలను లెక్కపెట్టక తన పరిశోధనలలో మునిగి తేలుతూ సామాన్యుల జీవితం మరింత సౌఖ్యవంతం చేయడానికి పూనుకొన్నాడు.

ఎలక్ట్రో కెమికల్ పద్ధతి వినియోగించి పోటాషియం కనుగొన్నాడు. అందరు శాస్త్రజ్ఞుల కంటే ఎక్కువ ఎలిమెంట్స్ డేవీ కనుగొన్నాడు. అల్యూమినియం ఒక్కటే తాను కనుగొనలేక పోయాడు. డేవీ ఉపయోగించిన ఎలక్ట్రో కెమికల్ పద్ధతిని అనుసరించే 1886లో అల్యూమినియం ను ఆక్సైడ్ నుండి అల్యూమినియం చార్లెస్ హాల్ కనుగొన్నాడు.

**నెపోలియన్‌చే మెడల్ ప్రదానం:** డేవీ పొటాషియం కనుగొన్నందుకు అతను ఇంగ్లీషువాడైనా, ఫ్రెంచి చక్రవర్తి నెపోలియన్ ఫ్రెంచి ఇన్‌స్టిట్యూట్ మెడల్‌ను అతనికి బహూకరించాడు. అప్పుడు ఇంగ్లండుకు - ఫ్రాన్సుకు యుద్ధం జరుగుతోంది. కానీ రాజకీయ వైరంతో నిమిత్తం లేకుండా, గొప్పశాస్త్రజ్ఞుడైన డేవీని ప్రత్యేకంగా ఫ్రాన్సుకు ఆహ్వానించి అతనిని నెపోలియన్ చక్రవర్తి సత్కరించడం అపూర్వం, అప్పుడు డేవీ వయస్సు కేవలం 30 సంవత్సరాలు.

డేవీ కనుగొన్న మరో గొప్ప సాధనం ఆర్క్‌లాంప్. 1809లో రాయల్ ఇన్‌స్టిట్యూట్‌లో డేవీ దీనిని ప్రదర్శించాడు. అతి శక్తివంతమైన లైట్ డేవీ కనుగొన్న ఆర్క్ లాంప్. సైన్స్ రంగంలో తరువాత గొప్పనిష్ణాతునిగా రూపొందిన మైకేల్ ఫారడే, డేవీ యిచ్చే ఉపన్యాసాలకు హాజరయ్యేవాడు. 1812లో అప్పుడు 21 సంవత్సరాల నవ యువకుడైన ఫారడే తాను విన్న డేవీ ఉపన్యాసాలన్నింటినీ వ్రాసి తీసుకువచ్చి డేవీకి యిచ్చాడు. అతని గ్రహణ శక్తికి,శక్తి సామార్థ్యాలకూ మెచ్చి ఫారడేను తన దగ్గర పరిశోధనలో భాగస్వామిని చేశాడు. ఈ విధంగా మరో తార ఉద్భవించింది. ఫారడే గురువును మించిన శిష్యుడయ్యాడు.

ఆ రోజులలో బొగ్గు గనులలో పనిచేసే కార్మికులు ఉపయోగించే దీపాల వలన గ్యాస్ పేలి ఎంతోమంది ప్రాణాలు పోతూవుండేవి. ఈ ప్రమాదాలు ఎలాగ తగ్గించడం అనేది అతనికి ఛాలెంజ్. డేవీ సైన్సును టెక్నాలజీగా మార్చగల సమర్థుడు. చివరకు ఒక "సేఫ్టీల్యాంప్"ని తయారు చేశాడు.



శిశువు హాయిగా నిద్రించే ఉయ్యాల, మృతుడు శాశ్వతంగా నిద్రించే సమాధి, ఈ రెంటిపైనా మెరిసే తార మానవుడి ఆశ. -అరవింద యోగి

నవకవిత్వం

## మోహనరాగం

ఒక బలీయమైన కోర్కె మొలకెత్తి
వెంటాడి వేధించి నీతో
స్నేహానికి ఊపిరులూదింది
స్నేహ పరిమళ ప్రవాహంలో
ఒక సుందరస్వప్నం..

చిటికెన వేలు పట్టుకోని
నీకంటే ఒక అడుగు వెనకవేస్తూ
ఎప్పుడూ అబద్దాలాడని నేను
మొదటిదీ చివరిదీ అబద్ధమాడి

నా ప్రియసఖుడా!
రెప్పలు మూతపడుట లేదు
మంచినీళ్ళు గుటక పడుటలేదు
నువ్వెక్కడున్నావో జాడతెలియక
మనసు మనసులో లేక
కాలానికి కళ్ళతికించి
నీకోసం ఎదురుచూస్తున్నా
ఊరుతల్లిలా...

రారా!
నా అమాయక చక్రవర్తి!!
నీ కళ్ళలో నా ప్రతిబింబాన్ని
చూసుకోని మృదువుగా



నిన్ను విడిచి వెళ్ళలేక
తడబడుతూ వెళ్ళిన బాధాతప్త
క్షణం ఇప్పటికీ వేదనాభరితమే!

వెన్నెల పూలారబోసి
ఒక సంచలిత మోహన రాగాన్నె
నా సౌందర్యరూపాన్ని ప్రేమగా
మనసారా నీకు అర్పించుకోని
ఎన్నేళ్ళయిందోగాని
తవ్వినకోద్ది విచ్చుకుంటూ
ఉబికివచ్చే సంతోష ఆనవా
ళ్ళింకా
ఇంకిపోనే లేదు...

స్పర్శించి
చిర్నవుల్ని కొప్పులో
తురుముకోవాలని ఉంది..

మూడుపొద్దులా
మొగలిపూల వాసనల్లో బంధీ
లమై
అమావాస్య చీకటి నుండి
సంకల్ప బలంతో
బయట పడాలనుంది..!?

– కె.విల్సన్‌రావు

## రన్నింగ్ వాయిస్

### పజిల్స్ పెంచాలి

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి. వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–హేమంత్, మౌలాలి

### కలర్ పేజీలు

కవర్ పేజీ కథనం సందర్భోచితంగా ఉంటోంది. పబ్లిక్‌ను ఇన్‌వాల్వ్ చేసే శీర్షికలు ఇస్తే బాగుంటుంది. అలాగే పాఠకుల అనుభవాలతో కూడిన ఓ శీర్షిక నిర్వహించండి. యూత్‌ను ఎంకరేజ్ చేసే శీర్షికలు, ఆడవారికి నచ్చే ఐటమ్స్ అన్నీ కవర్ అయితే సండే మరింత జనరంజకంగా ఉంటుంది. అన్నీ కలర్ పేజీలలో ఉండేలా చూడండి.




### వింతలు విశేషాలు

ఈ వారం వింతలు విశేషాలు ఎంతగానో బాగున్నాయి.వాస్తు సమాధానాలు సంతృప్తికరంగా ఉంటున్నాయి. న్యూమరాలజీ ద్వారా సమస్యలను పరిష్కరించుకుంటున్నాము. చక్కని శీర్షికను ఇలాగే కొనసాగించండి. పిల్లల పేజీలు పెంచితే బాగుంటుంది. ఎక్కువగా పజిల్స్ ఇస్తే మరింత బాగుంటుంది.

–వెంకట్, గొల్లపూడి

## 'కూని'రాగాలు

తనకోసమే తపనపడితే తాత్కాలికం..!
పరులకోసమయితే కీర్తి శాశ్వతం..!!

దర్పంతో యదార్థాన్ని గ్రహించలేవు..!
గర్వంతో సొంతవారు దూరం కాగలరు..!!

ప్రయాస వృథా అయితే వృద్ధి పొందలేరు..!
నిరాశ మనసును ఆవహిస్తే నిద్రపోలేరు..!!

జనంతో మమేకమయితే నాయకుడువైనట్టే..!
జ్ఞానంతో ఎదుగుతుంటే యోగివౌతున్నట్టే..!!

కలల్లో విహరిస్తే వాస్తవం భారంగా ఉంటుంది..!
వాస్తవంలో జీవిస్తే కలలు హాయిగా ఉంటాయి..!!

- కూనిరెడ్డి శ్రీనివాస్

### తేలికైన మనసు...

'సారీ రాజేష్.. మా వాళ్లు నా పెళ్లి నిశ్చయించారు' అంది బాధగా
'నిజంగానా.. నీమాట విన్నాక నా మనసు తేలికయింది' ఆనందంగా అనేసి నాలిక కర్చుకున్నాడు

### ఆ మాత్రం తెలియదా?

'ఉప్మాలో ఇంత పొడవైన వెంట్రుక వచ్చింది . అంటే దీనర్థం ఏంటయ్యా?' కోపంగా అడిగాడు అప్పారావ్.
'ఆ మాత్రం తెలియకపోతే ఎలా సార్..అది ఆడవాళ్లు చేసిన ఉప్మా' తాపీగా బదులిచ్చాడు సర్వర్

### ధర తగ్గనీ..!

పార్కులో ఇద్దరు ప్రేమికులు మాట్లాడుకుంటున్నారు.
'ఇంతకీ నా మెడలో తాళి ఎప్పుడు కడతావ్?' అడిగింది ప్రియురాలు
'బంగారం ధర కాస్త తగ్గాక ఆలోచిద్దాం' చెప్పాడు ప్రియుడు.

### సైలెన్స్...!

'పెళ్లి చూపుల్లో అతనడిగిన ప్రశ్నకు నువ్వేం సమాధానం చెప్పలేదు కదా..! మరి నువ్వెలాగ నచ్చావ్?' ఆశ్చర్యంగా అడిగిందిరాధిక
' అతడు లైబ్రేరియన్' సిగ్గుతో చెప్పింది విమల.

ఫన్ చ్

నారు









# అద్భుత శక్తుల సూపర్‌మ్యాన్



ఆరేళ్ల చిన్నారులనుంచి అరవై ఏళ్ల వృద్ధుల దాకా చూసి మెచ్చుకోకుండా ఉండలేరు సూపర్ మ్యాన్‌ను చూస్తే...యావత్ ప్రపంచాన్ని తన సాహసకృత్యాలతో ఆకట్టు కున్న ధీరుడు సూపర్‌మ్యాన్. ఆ ఆద్భుతా లకు హాలీవుడ్ వేదిక అయింది. కలెక్షన్లతో ప్రేక్షకులు అన్ని ఖండాలలో పట్టం కట్టారు. విశ్వ ప్రేక్షకులను ఎంతో థ్రిల్‌కు గురిచేసి బాక్సాఫీస్‌లోనూ తానే సూపర్ మ్యాన్ అంటున్న సూపర్ మ్యాన్ గురించి ఈ వారం తెలుసుకుందామా...






1978లో తొలి 'సూపర్ మ్యాన్' సినిమాను రూపొందించారు. ఈ సిరీస్‌లో భాగంగా ఇప్పటి వరకు 6 సినిమాలొచ్చాయి. సిరీస్‌లో ఏడవ చిత్రంగా 'బ్యాట్‌మ్యాన్ వర్సెస్ సూపర్ మ్యాన్' చిత్రం విడుదలయింది. 'సూపర్ మ్యాన్' సిరీస్‌లోని ఆరు చిత్రాలు సుమారుగా 1.67 బిలియన్ డాలర్ల కలెక్షన్లను రాబట్టడం విశేషం.

'స్పైడర్ మ్యాన్' లాగానే 'సూపర్ మ్యాన్' కూడా 'సూపర్ హీరో' కామిక్ బుక్ నుంచి పుట్టిందే. డిసి కామిక్స్ పబ్లికేషన్స్ బుక్స్ ఆధారంగా ఈ చిత్రాలకు రూపకల్పన చేశారు. దీనిలో భాగంగా మొదట 1941లో ఓ చిన్న యానిమేషన్ కార్టూన్ వచ్చింది. ఆ తర్వాత 1948, 50లో రెండు టీవీ సీరియల్స్‌గా రూపొంది బుల్లి తెర ప్రేక్షకుల్ని విశేషంగా అలరించాయి.

**జానపదాలను తలదన్నే కథ:**

క్రిప్టాన్ గ్రహం (కల్పిత)లో సైంటిస్టులు చిన్న పిల్లాడిని సూపర్‌నోవాగా మార్చేందుకు ప్రయోగాలు చేస్తుంటారు. ఈ క్రమంలో సూర్యుడి ప్రభావంతోపాటు అణు శక్తి ప్రభావం వల్ల ఆ గ్రహం మొత్తం విస్ఫోటనం చెందుతుంది. దీంతో ఆ పిల్లాడు ఆకాశంలో తిరుగుతూ కొన్నాళ్ళ తర్వాత భూమిపై ఓ వ్యవసాయ భూమిలో పడిపోతాడు. ఇది గమించిన ఓ జంట అతన్ని తీసుకెళ్ళి పెంచుతారు. వాళ్ళ దగ్గర పెరుగుతున్న తరుణంలో అతనిలోని మానవాతీత శక్తులు ఒక్కొక్కటిగా బయటపడుతుంటాయి. కొన్ని రోజుల్లోనే తనొక సూపర్ హీరో అని తెలుసుకుంటాడు. ఎన్నో శక్తులున్న ఆ కుర్రాడు పెద్దయ్యాక దుష్టుల నుంచి ప్రజలను కాపాడుతుంటాడనేది ఈ బ్రిటీష్ సూపర్ మ్యాన్ సినిమాల నేపథ్యం. తొలుత 1978లో 'సూపర్‌మ్యాన్' చిత్రం వచ్చింది. డిసి కామిక్స్ పాత్రల ఆధారంగా దర్శకుడు రిచర్డ్‌డోనర్ ఈ చిత్రాన్ని రూపొందించారు. క్రిప్టాన్ గ్రహం నుంచి భూమిపై పడ్డ సూపర్ మ్యాన్ క్రమ క్రమంగా ఎదుగుతూ దుష్టులు చేస్తున్న విధ్వంసాన్ని అడ్డుకోవడమనే ఇతివృత్తంతో ఈ చిత్రం తెరకెక్కింది. గ్రహాంతర వాసుల మధ్య, ఆకాశంలో జరిగే యుద్ధాలు, దుష్టులతో సూపర్ మ్యాన్ చేసే పోరాట సన్నివేశాలు ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి. సూపర్ మ్యాన్ పాత్రలో క్రిస్టోఫర్ రీవ్ నటించారు. ఓ వైపు సాధారణ క్లర్క్‌గా, మరో వైపు ఆసాధారణ సూపర్ మ్యాన్‌గా రెండు భిన్న పాత్రల్లో క్రిస్టోఫర్ నటన ప్రేక్షకుల్ని విశేషంగా ఆకట్టుకుంటుంది. ఈ చిత్రం 300 మిలియన్ డాలర్లకు పైగా కలెక్షన్లను రాబట్టి విమర్శకుల ప్రశంసల్ని సైతం పొందింది.

**సూపర్‌మ్యాన్ 2:**

తన ప్రియురాలిని కాపాడుకోవడానికి సూపర్ మ్యాన్ చేసే పోరాటమే ఈ చిత్రం. ఈ ఇందులో సూపర్ మ్యాన్ పాత్రలో క్రిస్టోఫర్ రీవ్, అతని ప్రియురాలి పాత్రలో మార్గోట్ కిడ్డర్ నటించారు. 1980లో విడుదలైన ఈ చిత్రం 190 మిలియన్ డాలర్లకుపైగా కలెక్షన్లలను కలెక్ట్ చేసింది.

**సూపర్ మ్యాన్ 3:** కంప్యూటర్ గురించి విస్తృత అవగాహన ఉన్న ఓ సంపన్నుడు గన్ అనే వ్యక్తి ద్వారా కంప్యూటర్స్‌లో కొత్త తరహా ప్రయోగాలు చేస్తుంటాడు. ఈ ప్రయోగాలతో ప్రపంచం మొత్తాన్ని గుప్పిట్లో పెట్టుకోవాలన్నది అతని లక్ష్యం. అతని బారి నుండి కంప్యూటర్ ఎక్స్‌పర్ట్‌ను సూపర్‌మ్యాన్ కాపాడ్డమనే ఇతివృత్తంతో దర్శకుడు రిచర్డ్ లెస్టర్ రూపొందించిన మరో సూపర్ హీరో చిత్రమిది. 1983లో విడుదలైన ఈ చిత్రంలో స్టీల్ బాడీ కల్గిన వ్యక్తిగా, సూపర్ మ్యాన్‌గా క్రిస్టోఫర్ రీవే నటన కనువిందు చేస్తుంది. విమర్శకుల ప్రశంసలందుకుంది.

**సూపర్ మ్యాన్ 4: ద క్వెస్ట్ ఫర్ పీస్:**

దుర్మార్గుడైన లెక్స్ లూథర్ తన స్వార్థం కోసం దుష్ట సోలార్ సూపర్ మ్యాన్(న్యూక్లియర్ మ్యాన్)ని సృష్టిస్తాడు. ఆ న్యూక్లియర్ మ్యాన్ ప్రపంచానంతా వినాశనం చేస్తుంటాడు. అతని ఎత్తులను సూపర్ మ్యాన్ ఎలా తిప్పికొట్టాడనేది ఈ చిత్రం ఇతివృత్తం. ఈ చిత్రానికి సిడ్నీ జె.ఫురే దర్శకత్వం వహించారు. 1987లో విడుదలైన ఈ చిత్రం క్రిటికల్‌గానూ, కమర్షియల్‌గానూ నెగటివ్ టాక్‌ను తెచ్చుకుంది.

**సూపర్ మ్యాన్ రిటర్న్స్:**

క్రిప్టాన్ గ్రహానికి వెళ్ళిపోయిన సూపర్ మ్యాన్ ఐదేళ్ళ విరామం తర్వాత తన ప్రియురాలి కోసం భూమిపైకి వస్తాడు. ప్రపంచాన్ని తన గుప్పిట్లో పెట్టుకోవాలని, అందుకు అడ్డుగా ఉన్న సూపర్ మ్యాన్‌ని చంపాలని ప్రతినాయకుడు లెక్స్ లూథర్ ప్లాన్ చేస్తాడు. ఆ ప్రయత్నాల్ని సూపర్ మ్యాన్ తిప్పి కొట్టి అనునిత్యం ప్రజలకు రక్షణగా ఉంటూ, తన ప్రేయసిని కలుసుకోవడమనే ఇతివృతంతో దర్శకుడు బ్రయాన్ సింగర్ ఈ అమెరికా సూపర్ హీరో చిత్రాన్ని రూపొందించారు. విజువల్ ట్రీట్‌గా నిలిచిన ఈ చిత్రం 391మిలియన్ డాలర్ల కలెక్షన్లను రాబట్టింది. 2006లో ప్రేక్షకుల ముందుకొచ్చిన ఈ చిత్రం పలు అవార్డులను సైతం దక్కించుకుంది.

**మ్యాన్ ఆఫ్ స్టీల్:** జాక్ స్నైడర్ దర్శకత్వంలో తెరకెక్కిన ఈ బ్రిటీష్ అమెరికా సూపర్ హీరో చిత్రం భారీ విజయాన్ని సొంతం చేసుకుంది. 2013లో విడుదలై ఈ చిత్రం తొలుత మిశ్రమ స్పందనను పొందినప్పటికీ తర్వాతర్వాత విశేప్రపేక్షకాదరణతోపాటు 668 తమిలియన్ డాలర్ల కలెక్షన్లను రాబట్టి సత్తాచాటింది.

**బ్యాట్‌మ్యాన్ వర్సెస్ సూపర్ మ్యాన్:**

సూపర్ హీరో కామిక్స్ వుస్తకాల నుంచి వుట్టిన మరో పాత్ర 'బ్యాట్‌మ్యాన్'. 'స్పైడర్ మ్యాన్', 'సూపర్ మ్యాన్' లాగానే 'బ్యాట్ మ్యాన్' కూడా ప్రజల రక్షణ కోసం పనిచేస్తుంటాడు. భూమికి సూపర్ మ్యాన్ కావాలా?, బ్యాట్ మ్యాన్ కావాలా అనే చర్చ ప్రపంచ వ్యాప్తంగా జరుగుతోంది. ఈ క్రమంలో బ్యాట్‌మ్యాన్‌కి, సూపర్ మ్యాన్‌కి మధ్య పోటీ నెలకొంటుంది. ఇందులో బ్యాట్‌మ్యాన్‌గా బెన్ అఫ్లెక్, సూపర్‌మ్యాన్ పాత్రలో హెన్రీ కావిల్ నటించారు.











ఓహో మేఘమాల...నీలాల మేఘమాల చల్లగ రావేలా, మెల్లగ రావేలా?... అని ఆ కలం పరిమళాలు సుతిమెత్తగా మన హృదయాలను స్పృశిస్తాయి.– మది ఉయ్యాల లూగి నవభావాలేవో... అని ప్రేమతో గగనవీథులలో భావాలు మనల్ని విహరింప జేస్తాయి.– అల్లదే ఆవల అదిగో నా ప్రియ కుటీర వాటిక... అని అక్షరాల గవాక్షాల్లోంచి వలపుల పర్ణశాలకు దారిచూపిస్తుంది. ఈ జన్మనసరిపోదు గురుడా... అని తాత్వికంగా జీవితాన్ని చిత్రించినా –అది ఆ కవన బ్రహ్మకే చెల్లింది! తెలుగు చలన చిత్రాలకు అందమైన కథలు అల్లి, ఆబాల గోపాలానికి చేరేలా మాటలు రాసి, అందరూ మెచ్చేలా పాటలను, పద్యాలను సృష్టించిన విశిష్టులు, "భారతీ తీర్థ "శతావధాని" –కీ శే వెంపటి సదాశివబ్రహ్మం.



# వెండితెర స(క)థా శివబ్రహ్మం

పద్యంలో ఆశు కవిత ఘనమైతే, గద్యంలో జీవితం మీద అనర్గళంగా ఆశువుగా చెప్పగలడం వీరి ప్రజ్ఞ! 'కథ' అనగా చెప్పడం కాబట్టి, ఈ 'చెప్పగలిగే కళ'ను సొంతం చేసుకొని ఎందరినో ఒప్పించి, మెప్పించగలిగిన కథామేటి –వెంపటి. తెలుగు సినిమా మలియుగం (1940 వ దశకం)లో కాలుపెట్టిన ఈ కలం యోధుడు సినిమా కథా కథన నాడీ వైద్యుడు. వెంపటి వంశం వారు హరితస గోత్రీకులు. అయితే కూచిపూడి నాట్యాచార్యు లైన వెంపటి సత్యం ప్రభృతులకు, సదాశివ బ్రహ్మం వారికి ఇంటిపేరు మినహా, ఏ సంబంధ బాంధవ్యాలు లేవు.

ఇహ మన 'కథా'నాయకుడైన వెంపటి సదాశివబ్రహ్మం గారు, 1905 ఫిబ్రవరి 18 వ తేదీన తూర్పుగోదావరి జిల్లా, తుని గ్రామంలో వెంపటి బ్రహ్మయ్యశాస్త్రి, వెంకా యమ్మ దంపతులకు మూడవ కుమారుడిగా జన్మించారు. తునిలో కవన మాలికలు అల్లుతూ 'కావ్యగాన వినోదేన, కాలోగచ్ఛతి' అన్నట్లుగా వెంపటివారు పాటలు, పదుతూ నాటకాలు వేస్తూ తిరిగేవారు. వారు చదివింది ఎనిమిదవ తరగతి మాత్రమే! కానీ సరస్వతీ మాత వరపుత్రునిగా, పద్యస్ఫూర్తితో పదేళ్ల వయసులోనే పద్యాలు ఆశువుగా చెప్పేవారు. పాఠశాలకు వెళ్లడానికి ఇచ్ఛగించక స్వయంగా సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషలు నేర్చుకొన్నారు. పంచకా వ్యాలను, ఆంగ్లసాహిత్యాన్ని అధ్యయనం చేసారు. అనతి కాలంలోనే ఆ ప్రాంతంలో 'బాలకవి'గా పేరు తెచ్చుకు న్నారు. తిరుపతి వేంకటకవుల ప్రభావంతో అవధాన విద్యపై మొగ్గు చూపారు. తన ధారణాసామర్థ్యంతో, ఆశు కవితా ధారతో అవధానాలు చేస్తూ, శతావధాని"గా పేరు తెచ్చుకున్నారు. ఎప్పుడూ ఎక్కడా ఓ చోట కాలు నిలవని వెంపటివారికి పెళ్లి చేస్తేనైనా ఇంటిపట్టున వుంటాడని భావించి, 1928 లో వారి 23 వ ఏట శ్రీకారుళానికి చెందిన జానకమ్మగారితో పెళ్లి జరిపించారు.

అప్పటికావిడ వయస్సు ఎనిమిది సంవత్సరాలే! వివాహ మయ్యాక ఆమెను తునిలో దించి, తాను మాత్రం స్వాతం త్ర్యోద్యమంలోకి దూకాడు. ముఖ్యంగా రంపచోడవరం మొదలగు ఏజెన్సీ ప్రాంతాలలో అల్లూరి సీతారామరాజు నిర్వహించిన పితూరీలలో పాల్గొన్నాడు. ఆ తరువాత కాం గ్రెసు పార్టీలో చేరారు. ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్షను అనుభవించారు. జైల్లో దేశభక్తి పూరితమైన పద్యాలను, గేయాలను రాసి ఎలుగెత్తి ఆలపించేవారట. ఆనాటి కాంగ్రెసు సభల్లో పాల్గొని, హరికథ, ప్రక్రియలో ప్రబోధాత్మక కథాగానాలను ఆలపిస్తు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయటంలో తన వంతు పాత్రను నిర్వహించినారు.

ఆ రోజుల్లో ఆంధ్రపత్రిక, శారద, భారత, మొదలగు పత్రికలలో వీరి కథలు ప్రతిఫలించే విధంగా వీరి రచనలు సాగేవి. అయితే వీరి రచనలకన్నా హరికథా గానానికే ముగ్ధులైయ్యేవారు ప్రజలు.

ప్రప్రథమ తెలుగుటాకీ నిర్మాత, దర్శకుడు, రోహిణీ సంస్థ అధినేత హెచ్.ఎం.రెడ్డి గారు, వెంపటి సదాశివబ్రహ్మం గారి హరికథను విని, వెంటనే తను నిర్మించే 'తెనాలిరామకృష్ణ' (1941) చిత్రానికి రచన చేయాల్సిం దిగా ఆహ్వానించారు. 1941 వరకే తెలుగులో దాదాపు 75 చిత్రాలు విడుదలై 'చిత్రవజ్రోత్సవాన్ని' చేసు కొంది. దైతాగోపాలం, బలిజేపల్లి కాళ్లకూరి, చందాల కేశవదాసు మొదలగు నాటకరచయితలు, సముద్రాల, కొసరాజు ప్రభృతులు సినీ రచనను మెరుగులు పెట్టి, కొత్త మార్గం పట్టించారు. వెంపటి వారి ప్రవేశంతో స్క్రీన్ ప్లే విధానంలో మార్పు వచ్చింది. అలాగే పాత్రల స్వరూప స్వభావాలను మరింత స్పష్టపరచే విధంగా సంభాషణలు రాయడంలో కొత్త ఒరవడిని వెం పటి సదాశివబ్రహ్మం సృష్టిం చారు. అలా వారు తొలి చిత్రంతోనే రచయితగా విజయం సాధించారు. 'తెనాలిరామకృష్ణ'కు అసిస్టెంట్ డైరె క్టర్‌గా పనిచేసి, అందులో నటించిన ప్రముఖ దర్శక, నిర్మాత ఎల్.వి.ప్రసాద్ గారు అనంతర కాలంలో వెంపటిగారితో ఎన్నో రచనలు చేయించారు.

1944 లోనే రాజాశాండో దర్శకత్వం వహించిన 'చూడా మణి' చిత్రానికి వెంపటి వారు స్క్రీన్ ప్లే సమకూర్చారు. నటగాయని టి.జి.కమలాదేవికి ఇదే తొలిచిత్రం. పుష వల్లి, నారాయణరావు, పి.ఎస్.ఆర్.సుందరమ్మ ప్రధాన పాత్రలు పోషించిన ఈ చిత్రం విజయం సాధించింది. 1941లో వచ్చినా 1950 దశకంలో రాబోతున్న సిని మాల తాలూకు ఛాయలన్నీ అందులో పొడచూపాయి. అప్పటి వరకు వచ్చిన పౌరాణిక చిత్రాల మూసను వదిలిపెట్టి 'చూడామణి' కొత్త పుంతల్ని తొక్కింది.

ప్రముఖ హాస్యనటి, గాయని టి. కనకం 'దేశదిమ్మరి' అనే చిత్రాన్ని వెంపటి వారితో ప్రారంభించినారు. కానీ చిత్రం తొలిదశలోనే ఆగిపోయింది. ఈ సినిమా కోసం రాసిన కథే 1957లో "స్వయంప్రభ" (1957 –సంగీతం –రమేష్ నాయుడు) గా అవతరించింది.

1942లో రోహిణి బ్యానర్ కింద హెచ్.ఎం.రెడ్డి నిర్మించిన 'ఘరానా దొంగ' చిత్రాన్ని వెంపటి రచన చేశారు. ఈ చిత్రానికి 'హానెస్ట్ రోగ్', "సత్యమేవ జయం" అని మరి రెండు పేర్లు కూడా ఉపశీర్షిక లుగా సూచించారు. ఇందులో ఎల్.వి.ప్రసాద్, దాసరి తిలకం హీరో హీరోయిన్లుగా నటించారు.

1943 నుంచి 1945 వరకు, దేశంలో యుద్ధ వాతావర ణం నెలకొన్న కారణంగా చిత్రనిర్మాణం కుంటుపడింది. అప్పటికే మద్రాసులో మాంబళంలో క్రిసెంట్‌పార్కు వద్ద ఓ అద్దే ఇంటికి కుటుంబంతో సహా మకాం పెట్టిన వెంపటి వారు, చేతినిండా సినీరచనలు లేకు మళ్లీ అవధానాలు, హరికథలు చెబుతూ కాలక్షేపం చేయసాగారు. ఈ కాలం వెలువడిన చిత్రాలకు 'ఘోస్టురైటర్'గా పని చేశారు కూడా! గూడవల్లి రామబ్రహ్మం గారు నిర్మించి 'పల్నాటి యుద్ధం' (1947) చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే రాసింది వెంపటివారే (టైటిల్స్‌లో పేరు కనిపించదు) అలాగే కాళ్లకూరి సదాశివ రావు దర్శకత్వంలో వచ్చిన "రాధిక (1948) సువర్ణమాల చిత్రాలకు కథ, స్క్రీన్‌ప్లే 'అందించారు'.

1948 లో దర్శక నిర్మాత సి.వి.రంగనాథ్ దాస్ సాధనా సంస్థను స్థాపించి 'దాసి' చిత్రాన్ని నిర్మిస్తూ వెంపటి సదాశివ బ్రహ్మానికే కథ, మాటలు, పాటలు రాసే అవకాశం ఇచ్చారు. కానీ ఆ చిత్రం సగంలోనే ఆగిపోయింది.









తెలుసుకోండి'లా'

# గృహహింస చట్టం పరిధులు



ప్ర: 2008 సంవత్సంలో పెద్దల సమక్షంలో మా బంధువైన ఒక వ్యక్తితో నా వివాహము జరిగినది. 6 నెలల తరువాత మా ఇద్దరిమధ్య కొంత భేదాభ్రిపాయం రావడంతో నన్ను మా వుట్టింటికి పంపించాడు. తరువాత అతను ఎక్కడో వేరే పెళ్లి చేసుకున్నాడని తెలిసింది. నాకు నా భర్త చేసిన మోసాన్ని వివరిస్తూ ఒక న్యాయవాది ద్వారా గృహహింస చట్టం క్రింద 2009లో వేసిన కేసులో ఇంతవరకు నాకు ఎలాంటి మనోవర్తిగాని, ఉండడానికి నివాసము గాని లభించలేదు. దీనితో నేను కృంగిపోయి ప్రతివారిని సలహ అడుగుతున్నాను. ఇప్పటివరకు నలుగురు న్యాయవాదులను సంప్రదించాను. ప్రతీచోటా అందరికీ అడిగినంత డబ్బులు ఇచ్చుకుంటూ వస్తున్నాను. ఇదేమిటి అని అడుగగా నీయొక్క ఈ.గ.ఇ లో నివాసము అడుగలేదు అని కొంత, తాత్కాలిక మనోవర్తి అడగలేదు అని, నీకు ఏమి రావు అని కొంత... ఇలా రకరకాలుగా చెప్పుచున్నారు. అయితే మా అత్తమామల సొంత ఇల్లు ఉంది. ఆ ఇంట్లో నివాసం ఉండడానికి నేను ఎలాంటి చర్య తీసుకోవచ్చు? ఈ విషయంలో నా పరిధులేమిటి? వివరించండి.

–నళిని, రాజమండ్రి

జ: మీ పెళ్ళి పెద్దల ద్వారా జరిగినదా లేదా ప్రేమపెళ్ళి చేసుకున్నారా అన్నది ముఖ్యం కాదు. పెళ్ళి జరిగినదా లేదా అనేదే ముఖ్యం. దీనికి గల అధారాలు, సాక్ష్యాలు ఉన్నాయా? లేవా? అన్నది మాత్రమే ముఖ్యం. గృహహింస చట్టం రాకముందే విడిపోనప్పటికీ ఈ చట్టం కింద భరణం పొందే అధికారం ఉందని కోర్టు పేర్కొంది. ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని

**ఢిల్లీకి చెందిన ఒక జంటకు సంబంధించిన వైవాహిక కేసును పరిష్కరిస్తు జస్టిస్ అల్తావాస్ కబీర్, జస్టిస్ జె.చలమేశ్వర్‌లతో కూడిన ధర్మాసనం ఈ మేరకు రూలింగ్ ఇచ్చింది. అదే విధముగా భర్త నుంచి విడిపోయిన భార్యకు భర్త ఇంట్లో ఉండే హక్కు ఉందని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.**

సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. అదే విధముగా భార్యకు దీని కింద రక్షణ లభిస్తుంది. ఈ మేరకు డీల్లి హైకోర్టు వాదన సబబే అని పేర్కొంది.

అదే విధముగా భార్యకు తన నివాసంలోని గణనీయ భాగాన్ని కేటాయించల్సిన బాధ్యత భర్తపై ఉంటుందని వివరించింది. వి.డి. భానోత్ భార్య సవితా 2006 నవంబర్ 29న గృహహింస నిరోధక చట్టంలోని సెక్షన్ 12 కింద మేజిస్ట్రేట్ ఎదుట ఒక పిటీషన్ దాఖాలు చేశారు. దీంతో భావో త్ నివాసంలోని మొద టి అంతస్తులో ఉండేందుకు వీలు కల్పిం చాలని మేజిస్ట్రేట్ అదేశించారు. దాని ఆధారముగానైనా సరే పెండింగ్‌లో వున్న డి.వి.సి అనగా గృాఎహహింస నిరోధక చట్టం గల కేసులో తాత్కాలికమైన పీటిషన్స్ మూడు. ఒకటి ఖ్ఱటజీర్ఖు౹ఙ్ఖ్ఛీ౹చ్ఛి. రెండవది పోలీసు రక్షణ. మూడవది మీ యొక్క అత్తమామల ఆస్తి అనగా ఇంట్లో ఉండటానికి వసతి అని మూడు పిటిషన్స్ వేసి న్యాయస్థానమునకు నమ్మదగు విధముగా చెప్పి కోర్టు ద్వారా ఆర్డర్స్ తీసుకొని వెళ్ళగలరు. అలాంటి అర్డర్స్ లేకుండా చట్ట విరుద్ధమైన పనులు చేయరాదు. కావున మీరు నేను చెప్పినట్టు 3 పిటిషన్స్ ద్వారా అర్డర్స్ తీసుకొని నచో మీ భర్త ఎక్కడ వున్నా, తప్పక న్యాయము జరుగును. అదేవిధముగా మీ భర్త రెండవ పెళ్ళి చేసుకొనినట్లు అధారాలు ఉంటే మాత్రమే కేసు పెట్టగలరు. అధారాలు లేకుండా కేసు పెట్టవద్దు.



ప్ర: 2006లో ఒక వ్యక్తి తో వివాహేతర సంబంధం ద్వారా ఒక బాబుకు తల్లినయినాను. అతను నన్ను పెండ్లి చేసుకుంటానని చెప్పి మోసం చేసినాడు. అతనికి అంతకు ముందు హైదరాబాద్‌లోని ఒక అమ్మాయితో పెద్దల సమక్షములో పెండ్లి అయినట్లు, అతనికి ముగ్గురు కొడుకులు కూడా ఉన్నారని తెలసినది. నేను మోసపోయానని గమనించిన వెంటనే... మా దగ్గరలోని పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేసినాను. కానీ, ప్రయోజనం లేకపోయినది. దీనికి కారణం అతనికి డబ్బు, రాజకీయం అండగా ఉన్నాయి. ప్రస్తుతం నా పిల్లవాన్ని పోషించడం చాలా కష్టంగా ఉన్నది. ఇక్కడ పెద్దలు కూడా నాకు ఎలాంటి న్యాయం చేయడం లేదు, అదేమి అనగా నీవు వివాహేతర సంబంధం ద్వారా పిల్లవాన్ని కనడం నేరం. అతనికి ముందుగా పెళ్ళి అయినట్లు విచారణ చేయకుండా ఎలా ఈ పని చేసినావు అని నన్నే తిట్టుచున్నారు. దీనికి న్యాయ పరిష్కారం చెప్పగలరు.

– రేవతి, నల్లగొండ జిల్లా

జ: ఇలా చాలామంది మోసపోవడం తరువాత బాధపడడం, అనేక రకములుగా జరుగుచున్నవి. దీనికి కారణం అమ్మాయి తొందరప డటం, అదే విధంగా ఇలా మోసగాళ్ళకు బుద్ధి చెప్పలేకపోవడం. అలాగే మన చట్టాలు మన కు సహకరించకపోవడం. ఇలా అనేక రకములుగా అడవాళ్ళు మోసపోవడం జరుగుచున్న ది. అయిన మీరు అధైర్యపడకుండా ధైర్యంగా మీదగ్గరలోని జిల్లా శిశు సంక్షేమ శాఖ ఏజెన్సీ ద్వారాగాని లేక నేరుగా మీ దగ్గరలో కోర్టులో ని ఉచిత న్యాయసేవా కేంద్రములో గాని సంప్రదించి మోసపూరితమైన కేసు (క్రిమినల్) పెట్టుచూ సెక్షన్ 125 క్రిమినల్ ప్రొసీడింగ్ రూల్స్‌లోని సబ్‌సెక్షన్ (బి) క్రింద వివాహమై నా, కాకున్నా... స్వయం పోషణ చేసుకోలేని, మైన రుగా ఉన్న తన సక్రమ లేక అక్రమ బిడ్డకు, అక్రమ సంబంధ మైన... అనగా తల్లికి బిడ్డకు నెల పోషణ, రక్షణ, నివాసం కోసం భరణ పోషణ అనగా నెలసరి రేటు చొప్పున మెజి స్ట్రేటు ఉత్తరువు నీయవచ్చు.

# గృహారంభ ప్రవేశ ముహూర్త విశేషాలు

## ముహూర్త విశేషాలు

### గృహ ప్రవేశ సమయంలో అపశకునాలు

చెడ్డమాట, శత్రువు మాట వినిపించడం, మద్యం, చర్మ, అస్థికలు, గడ్డి, ఊక, పాము కుబుసం, బొగ్గులు, పత్తి, ఉప్పు, బురద కనిపించడం మంచిది కాదు. నపుంసకుడు, నూనె, మందులు, మలం, నల్లధాన్యాలు, అనారోగ్య వంతుడు, తలంటు పోసుకున్నవాడు, పతితుడు, జటిలుడు, పిచ్చివాడు, జట్టులేనివాడు, తలపై ఆచ్ఛాదన లేని (బట్టతల) వాడు, ఇంధనాలు (కట్టెలు, బొగ్గులు) పక్షులు, మృగాలు, మనుష్యులు మొ.గు అరుపులు, వినిపించడం మంచివి కావు.

దిక్కులు (ఎర్రని మేఘాలతో), మంటలతో కనిపించడం, పొగ నిండి ఉండడం మొ. కనిపిస్తే మరణం, గృహారంభంలోగాని ప్రవేశంగాని అపశకునం సమయంలో కనిపిస్తే ఆ ప్రదేశంలో ఎముకలు ఉన్నట్లు గుర్తించాలి. గృహ ప్రవేశ సమయంలో అపశకునాలు కనిపిస్తే, ఆ ఇంట్లో నివశించరాదు. శంకుస్థాపన సమయంలో అపశకునాలు కనిపిస్తే, ఆ ఇల్లు కట్టరాదు.

మూల, ఆశ్రేష, మిశ్ర నక్షత్రాలు (కృత్తిక, విశాఖ), ఉగ్ర నక్షత్రాలు (పుబ్బ, పూర్వాషాడ, పూర్వాభాద్ర, మఘ, భరణి) –ఇవి ఊర్ధ్వముఖ నక్షత్రాలు. ఊర్ధ్వముఖ నక్షత్రాల్లో రాజ్యాభిషేకం, పట్టబంధం తదితర ఊర్ధ్వ కృత్యాలు చేయాలి. ఆధునిక కాలంలో పర్వతారోహణం, విమానయానం, తదితర వాటిని ఊర్ధ్వ ముఖ కృత్యాలుగా గుర్తించవచ్చు.

రేవతి, అశ్విని, చిత్త, స్వాతి, హస్త, పునర్వసు, అనూరాధ, మృగశిర, జ్యేష్ట, తిర్యఙ్ముఖాలు.

ఏనుగు, గుర్రం, ఎద్దు, దున్నపోతు తదితర వాటిని అదుపు చేయటం, బీజావాపం, ప్రయాణం (రాకపోకలు), చక్రం, యంత్రం, రథం తదితర కొత్త వాటిని వాడడం మొదలైన తిర్యఙ్మ కృత్యాలను పైనక్షత్ర సమయాల్లో ఆరంభించాలి.

దేవ ప్రతిష్ట

దేవతా ప్రతిష్టకు శుభ మాసాదికాలు

మాఘ పంచకం (మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ట మాసాలు) శుక్ల పక్షం, ఉత్తరాయణం మంచివి. రిక్త తిథులు (చవితి, నవమి, చతుర్ధశి) మంగళవారం మంచివి కావు.

ఏ తిథికి ఏ దేవత అధిపతో ఆ తిథి ఆ దేవ ప్రతిష్టకు మంచిది. ఉదాహరణకు చవితి గణపతికి, నవమి రామునికి దుర్గాదేవికి మంచివి.

శుభ నక్షత్రాధికం

పూర్వాభాద్ర, ఉత్తరాషాడ, మూల, ఉత్తరాభాద్ర, ఉత్తర, జ్యేష్ట, శ్రవణం, రోహిణి, పూర్వాభాద్ర, హస్త, అశ్విని, రేవతి, పుష్యమి, మృగశిర, అనూరాధ, స్వాతి, ప్రతిష్టకు శుభమైనవి.

దేవతా విశేషాలు– లగ్నాలు

సింహంలో సూర్యునికి, మిథునంలో శివునికి, కన్యలో విష్ణువునికి, కుంభంలో బ్రహ్మ, చరరాశుల్లో క్షుద్ర దేవతలకు, స్థిర లగ్నాల్లో అందరు దేవతలకు ప్రతిష్టకు శుభ ప్రదం.

శివలింగ స్థాపన

మాఘ, ఫాల్గుణ, వైశాఖ, జ్యేష్ట, ఆషాడ, శ్రావణ, భాద్రపదాల్లో శివలింగ ప్రతిష్ట చేయవచ్చు.

దేవీ స్థాపన

మాఘం, ఆశ్వయుజం, దేవీ ప్రతిష్టకు మంచివి.

దేవీ పూజకు విశేషం

తిథి నక్షత్రాదులు, ఉపవాసాదులు చూడనక్కర లేకుండా, కృష్ణ పక్షంలోను, దేవి పూజాదికం చేయవచ్చు. రాత్రి దేవీ రూపం, పగలు శివ రూపం కాబట్టి రాత్రి సమయాల్లో (నైనా పగలైనా) పరమేశ్వరి సిద్ధి ప్రదురాలే.

దక్షిణాయన విశేషం

దేవి, భైరవుడు, వరాహ నారసింహ, వామన, మహిషాసుర మర్ధిని, మూర్తులను దక్షిణాయనంలో ప్రతిష్టించడం మంచిది.

సుసర్ల. బాబురావు
ఎం.ఎ (ఆస్ట్రోలజీ)



అంతా నిన్ను అవమానిస్తున్నప్పుడు, వినయంగా వుండడం మంచిది కాదు. కానీ అందరూ నిన్ను ప్రశంసిస్తూన్నప్పుడు వినయంగా వుండడం మాత్రం చాలా అరుదయిన విషయం. -సెయింట్ బెర్నార్డ్















# బాధ్యతలను మరిచి బ్రతకడం కూడా నేరమే

రాజ్యాంగానికి కట్టుబడి నడవడమే భారతీయపౌరునికి శిరసావధి. ఇందులో ఎవరికీ మినహాయింపు ఉండడానికి అవకాశం లేదు. సరదా కోసమో , సెన్సేషన్ కోసమో సోషల్ మీడియా లైక్స్ కోసమో ఎవరి పరిధి వారు మరచి మసలడం సరికాదు. ప్రత్యేకించి ప్రజల భావోద్వేగాలతో పరాచికాలు ఆడడమంటే ఆ తరహా మనుషుల మానసిక స్థితికి చికిత్స అవసరమనుకోవాలి. ఈతరం మనుషులకు సోషల్ మీడియాలో సంచ రించి రావడం పరిపాటైపోయింది కాదు దినచర్యలో ఒక భాగమైపోయింది. ఈ నేపథ్యంలో ప్రతీస్మార్ట్ ఫోన్‌దారు వాట్స్‌ప్, ట్విట్టర్, ఫేస్‌బుక్ లాంటి అనేక సోషల్ నెట్‌వర్క్‌లు కలిగిఉండడం కూడా ఇందుకు కారణం కావచ్చు. పొలిటికల్ మీటింగ్‌కు జనంముందు చేసే ఉపన్యాసాలజోరు తరహానే ఇక్కడ కూడా జరుగుతుంటుంది. ప్రతీ విషయాన్ని వివాదాల్లోకి నెట్టేసే నెటిజన్లు ఎక్కువ సంచరిస్తూ వుంటారు. ప్రచారం అధికంగా ఎక్కువచ్చేసరికి ఎవరికి వాళ్లు విజేతలైనట్టుగా ప్రకటించు కుంటున్నారు.




ఇదంతా అవసరమా అంటే చెప్పడం కష్టమే. ఎందుకంటే సాక్షాత్తు ప్రధాని మంత్రి మోడీయే ఈసోషల్ మీడియా అభిప్రాయసేకరణ చేస్తున్నారు. ప్రత్యక్షంగా నెటిజన్ల సమస్యలపై స్పందిస్తున్నారు. దీని వలనకూడా సోషల్ మీడియాపై ప్రజలకు ఆకర్షణ పెరిగిపోయింది. ఈనేప థ్యంలో సోషల్‌మీడియా ట్రాఫిక్







అమాంతం పెరిగిపోయి అదో రకపు వ్యసనంలా తయారయ్యిందనే చెప్పాలి. అన్ని వర్గాలవారు ఏదో ఒక సమయంలో నెట్‌లలో సందర్శించివెళుతూండటం పరిపాటిగా పెట్టుకున్నారు. ఇంతవరకూ ఎవరికీ అభ్యంతరం ఉండకపోవచ్చు కానీ సోషల్‌మీడియా వల్ల వ్యక్తిగత స్వేచ్ఛకు భంగం కలగకుండా ప్రవర్తించాలి. ఒకరిపై ఒకరు వేరొకరి బలహీనతలను బహిర్గతం చేయడానికి ఇది వేదిక కాకుండా ఉండాలి. అవమానభారంతో చాలామంది సోషల్‌మీడియా సాక్షిగా బాధ పడటం ఇంకా ముందుకు పోయి ఆత్మబలిదానాలను చేసుకోవడం కూడా చూస్తున్నాం. నాగరికత ముసుగులో వేసున్న వెర్రివేషాల మూలంగా పోతున్న అమాయక ప్రాణాల విలువను గ్రహించాలి. సాంకేతకత ను సన్మార్గంలో ఉంచే ప్రయత్నాలలో భాగంగా సంబంధిత చట్టాలను కఠినతరం చేయడం అవసరమని ప్రభుత్వాలు భావించాలి. ఆ దిశలో ముందుకు పోయిన రోజున సోషల్‌మీడియా వల్ల యువతకు విజ్ఞానాన్ని వినోదాన్ని అందించడంలో పైచేయిగా ఉంటుంది.

కూనిరెడ్డి శ్రీనివాస్

# ఆరోగ్యమే మహా భాగ్యం




'ఖరీదైన జీవితాన్ని, కలల ప్రపంచాన్ని ఆవాహనం చేసుకునే ప్రయత్నంలో ఆరోగ్యం గురించి ఆలోచించే సమయం దొరకడంలేదు. ఆలోచనా ధోరణి కూడా విభిన్నమైన దృక్పథంతో ఉంటోంది. సమయం అనుకూలంగా ఉన్నప్పుడే సొమ్ము చేసుకోవాలనే కలలు ఎక్కువైపోతున్నాయి. రుచి పలు రకాలు కదా. ఏ రకమైనవి వంటికి, కంటికి హాని కలుగచేస్తుందో తెలియదు. ఆరగించేటపుడు హాయిగా ఉంటుందనే తప్ప మిగిలిన ఆలోచనలే ఉండవు. కాలక్రమంలో మనం తిన్న ఆహారం మన ఆరోగ్యాన్ని పాడు చేయవచ్చు. లేదంటే పక్కదారుల్లో క్షీణించడానికి మార్గాలు వేయనూవచ్చు. ఆహార నియమాలు పాటించకపోయినా జీర్ణకోశాలు ఇబ్బంది పడుతుంటే ఎంతమంది గ్రహించగలుగుతున్నారు. ప్రపంచం చిన్నదైపోయింది. ఎప్పుడైనా...ఎక్కడికైనా సులువుగా ప్రయాణించే రోజులివి. ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి వెళ్లేటప్పుడు గాలిలోనూ, నీరులోనూ, తినే పదార్థాల్లోనూ మార్పులు సహజం. అప్పటివరకు ఉన్న ఆహారపు అలవాట్లు ఒక్కసారి మార్పులకు గురైనప్పుడు శరీరం సహజంగానే ఇబ్బందులకు గురికావచ్చు. ప్రస్తుత హైటెక్ సమాజంలో చిన్నారుల తిండికి నియమాలు విధించడం కించిత్తు కష్టమైన పని. పిజ్జాలు, బర్గర్లు, రకరకాల చాక్లెట్లు, బిస్కెట్లు మార్కెట్‌లోనికి రావడంతో పిల్లలు ప్రసార మాధ్యమాల పట్ల ఆకర్షితులవుతున్నారు. దరిమిలా వారిని కట్టడి చేయడం కష్టసాధ్యమైన విషయంగా మారుతున్న రోజులు ఇవి. అందువల్లనే 70 ఏళ్లకు ఏ మాత్రం ఢోకా లేకుండా ఉండాల్సిన పళ్లు ఏడేళ్లకే పుచ్చుపోయే పరిస్థితి చూస్తున్నాం. ఆడుతూ, పాడుతూ ఎదుగుతూ చదువుకోవాల్సిన బాల్యం పుస్తకాల బరువులతో ర్యాంకుల రాపిడితో బాల్యం బలైపోతున్నది. ఉదయాన్నే వచ్చే బస్సుల కోసం నిద్రచాలక బద్ధకంగా చిన్నారులు బతుకీడుస్తున్న రోజులు ఇవి. తీక్షణంగా అదే పనిగా పుస్తకాల్లో పురుగుల్లా మారుతున్న రోజులు కాబట్టే చిన్నారుల కళ్లకు అద్దాలు వచ్చేశాయి. చదువు ఒత్తిడి, ఆ తరువాత ఉద్యోగ వేట, బతుకు భారాలు వెరసి సగం వయసు పూర్తికాక మునుపే గుండెనొప్పులు, రక్తపోటులు, షుగర్ వంటివి రావడం నేటి తరానికి సర్వసాధారణంగా మారిపోయాయి. ఈ మార్పులను గమనిస్తున్న కార్పొరేట్ సంస్థలు మల్టీస్పెషాలిటీ ఆసుపత్రులకు తెరలేపాయి. తెలుగు రాష్ట్రాల్లో మీడియా ద్వారా ప్రచార హోరుతో మార్కెట్‌లో హల్‌చల్ ప్రారంభించాయి...'

★ తెలుగు రాష్ట్రాల్లో కార్పొరేట్ల జోరు
★ ఆసుపత్రుల టేకోవర్‌పై ప్రత్యేక దృష్టి
★ రోగులకు అనుగుణంగా పెరగని పడకలు
★ పెరుగుతున్న ప్రసూతి మరణాలు
★ మందులకూ అరకొర కేటాయింపులు
★ ప్రైవేటులోనే ఆధునిక వైద్యసేవలు
★ వేతనాలు పెంచినా వైద్యుల నసేమిరా






వైద్యరంగం కొత్త పుంతలు తొక్కుతున్న తరుణంలో తెలుగు రాష్ట్రాల పై కార్పొరేట్ యాజమాన్యాలు కన్నేశాయి. దీపం ఉండగానే ఇల్లు చక్కపెట్టుకోవాలనే చందంగా ఇక్కడి ఆసుపత్రులను టేకోవర్ చేసుకుంటున్నాయి. తక్కువ ఖర్చుతో మెరుగైన వైద్యం అందిస్తామంటూ ప్రకటనలు ఇస్తూ బీమా, ఇతర సౌకర్యాల పేరుతో పేద రోగులకు గాలం వేస్తున్నాయి. ఆరోగ్యమే మహాభాగ్యం అంటూ కార్పొరేట్ కల్చర్‌ను ప్రజల్లోకి చొప్పిస్తున్నాయి. ఇందుకు తగ్గట్లుగా ప్రభుత్వాలు కూడా ప్రైవేటు రంగానికి రెడ్ కార్పెట్ వేస్తుండడంతో తెలుగు రాష్ట్రాల్లో ఇటీవలి కాలంలో పలు కార్పొరేట్ ఆసుపత్రులు పాగా వేశాయి. అత్యాధునికి గుండె, కాలేయ, కిడ్నీ శస్త్రచికిత్సల నుంచి, కన్ను, పన్ను ఇలా ప్రతి ఒక్క అవయవానికి ప్రత్యేక చికిత్సలు తమ వద్ద అందుబాటులో ఉన్నాయంటూ ప్రచారం చేసుకుంటున్నాయి.

**సర్కారు ఆసుపత్రుల్లో అరణ్య రోదన...**



పేరుకు పెద్దాసుపత్రులు ఉన్నా అక్కడ వైద్యసేవలు అందడం మాత్రం గగనమే. సిబ్బంది కొరతతో పాటు వైద్యులు లేక పోవడంతో రోగులకు అరకొర వైద్యసేవలు మాత్రమే దిక్కవుతున్నాయి. రోగులకు అవసరమై మౌలిక వసతులను కల్పించడంలో ప్రభుత్వం మీనమేషాలు లెక్కిస్తోంది. వైద్య నిపుణులు లేకపోవడంతో పాటు కిందిస్థాయి వైద్య సేవలను అందించే నర్సింగ్ సిబ్బంది కూడా లేకపోవడంతో ఆసుపత్రులకు వచ్చే రోగులకు ఇబ్బందులు ఎదురవుతున్నాయి. తెలుగు రాష్ట్రాల్లోని జిల్లా ఆసుపత్రుల్లో ల్యాబ్ టెక్నీషియన్లు కూడా లేకపోవడం పరిస్థితి తీవ్రతకు అద్దం పడుతోంది. ఇక ప్రభుత్వ ఆసుపత్రుల్లోనూ ఆరోగ్యశ్రీ సేవలు అందిస్తున్నా బడ్జెట్ మాత్రం పెరగకపోవడం గమనార్హం. ఇక సామాన్యులకు ఇచ్చే చిన్నపాటి మందులకు కూడా కొదవే.

**సామాన్యులకు వైద్యం గగనమే...**




సర్కారు వైద్యం సామాన్యులకు దూరమవుతోంది. ఆసుపత్రులకు వచ్చే రోగుల సంఖ్య రోజురోజుకు పెరుగుతున్నా అందుకు అనుగుణంగా మౌలిక వసతులను కల్పించడంలో ప్రభుత్వం విఫలమవుతోంది. ప్రభుత్వ ఆసుపత్రుల్లో వైద్యుల కొరత రోగులకు శాపంగా మారుతోంది. మరోవైపు చిన్నారుల ప్రాణాలు సర్కారు ఆసుపత్రుల్లో గాలిలో దీపంలా మారుతున్నాయి. శిశువులకు అవసరమైన ఇంక్యుబేటర్‌ల నుంచి అన్నిరకాల పరికరాలు ఆసుపత్రుల్లో లేక ప్రైవేటు ఆసుపత్రులను ఆశ్రయించాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. ప్రభుత్వ ఆసుపత్రుల్లో 40 శాతం వరకు వైద్య సిబ్బంది పోస్టులు ఖాళీగా ఉన్నాయి. పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కేరళ, కర్నాటకలలో ఏటా మార్చి నెలాఖరు వరకు వైద్యసిబ్బంది నియామకాలు చేపట్టి జూన్ ప్రారంభం నుంచి వారితో సేవలను అందిస్తున్నారు. కానీ మన రాష్ట్రాల్లో మాత్రం అలాంటి పరిస్థితి కనిపించక పోవడం గమనార్హం. టీచింగ్ ఆసుపత్రులు ఉన్న జిల్లాల్లో సైతం వైద్యం కోసం రోగులు అల్లాడుతున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో మెడికల్ ఆఫీసర్ల పోస్టులను భర్తీ చేయకపోవడం, ఏళ్ల తరబడి ఖాళీగా ఉన్న వైద్యాధికారులకు ప్రమోషన్‌లు ఇవ్వకపోవడంతో వ్యాధులు విజృంభిస్తున్న సమయంలో ప్రజల ప్రాణాలు గాల్లో కలుస్తున్నాయి. మరోవైపు అంటు వ్యాధుల విషయంలో వైద్యశాఖ మాత్రం ఈ ఏడాది గత ఏడాది కంటే తగ్గుముఖం పట్టాయని ప్రకటించడం కొసమెరుపు. వాస్తవంగా నమోదవుతున్న కేసులకు, వైద్యశాఖ లెక్కలకు మరణాల్లో పొంతన కనిపించడంలేదు. మాతా శిశు సంరక్షణ కింద ఏటా కోట్లాదిరూపాయల నిధులను ఖర్చు చేస్తున్నా ఫలితం కనిపించడంలేదు. ఇతర రాష్ట్రాలతో పోలిస్తే మన రాష్ట్రంలో ఈ మరణాల సంఖ్య ఎక్కువగా ఉంటోంది. ప్రతి వెయ్యిమంది శిశువుల్లో మరణాలు కేరళలో 15, తమిళనాడులో 31, కర్నాటకలో 43 ఉండగా మన రాష్ట్రంలో మాత్రం 53గా నమోదవుతున్నాయి. శిశువుల సంరక్షణ కోసం ఏర్పాటు చేయాల్సిన నవజాత సంరక్షణ కేంద్రాలు కూడా అటకెక్కాయి. మరోవైపు ఆరోగ్యశ్రీ పేరుతో ప్రభుత్వం కార్పోరేట్ జపం చేస్తూ ప్రజావైద్యా నికి పాతరేస్తోంది.



**ఆసుపత్రుల్లో కనిపించని పారిశుధ్యం...**

తెలుగు రాష్ట్రాల్లోని ప్రభుత్వ ఆసుపత్రుల్లో అపరిశుభ్రత కనిపిస్తోంది. ప్రభుత్వ బోధనాసుపత్రులైన ఆసుపత్రుల్లో కొత్త పారిశుధ్య విధానం అమలు చేయనున్నట్లు గతంలో ప్రభుత్వం ప్రకటించింది. ప్రస్తుతం ఆసుపత్రుల్లో పారిశుధ్య నిర్వహణ కోసం సంవత్సరానికి కోట్లు ఖర్చు చేస్తున్నా సిబ్బంది కొరత, తగిన పర్యవేక్షణ లోపించడంతో పారిశుధ్య పనులు మొక్కుబడిగా సాగుతున్నాయి. దీంతో ఆసుపత్రుల్లో భరించలేని దుర్గంధంతో రోగులు ప్రభుత్వ ఆసుపత్రులకు రావాలంటేనే భయపడే పరిస్థితి నెలకొంది. ఈ పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని పారిశుధ్య నిర్వహణను ప్రైవేటు వారికి అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయం ఇంకా పూర్తిగా అమలులోకి రాకపోవడం గమనార్హం.



**ఆసుపత్రుల్లో రోగుల అరణ్యరోదన...**

సర్కారు ఆసుపత్రుల్లో రోగుల కష్టాలకు తెరపడడంలేదు. ఉచితంగా వైద్యం అందుతున్న ఆశతో వచ్చే పేదలకు అడుగడుగునా అవరోధాలు కలుగుతున్నాయి. రాష్ట్రవ్యాప్తంగా ఆసుపత్రుల్లో రోగులకు అవసరమైన పడకలను సమకూర్చడంతో సర్కారు విఫలమవుతోంది. ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఒక్కో బెడ్‌పై ఇద్దరు రోగులను ఉంచి వైద్యులు చికిత్సను చేయాల్సి వస్తోంది. దీనికి తోడు వైద్యుల కొరత, మౌలిక వసతులు కల్పించలేకపోవడం వంటి కారణాలతో రోగులు ప్రభుత్వ ఆసుపత్రులకు రావాలంటేనే భయపడుతు న్నారు. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చిన తరుణంలో కొత్త వైద్యసేవలు అందుబాటులోకి వచ్చినా అవి ప్రైవేటులో మాత్రమే అందు బాటులో ఉంటున్నాయి. ఏటా రాష్ట్రంలో 2800మంది మహిళలు ప్రసూతి సమయాల్లో మరణిస్తున్నాకవు పరిస్థితి ఎలా ఉందో అర్థమవుతుంది. ఇందులో ఎక్కువగా గిరిజన మహిళలే ఉంటు న్నారు. ప్రభుత్వ ఆసుపత్రుల్లో మందులు దొనకడం కూడా గగనమవుతోంది.

–ఇస్కా రాజేష్‌బాబు
'సూర్య' అమరావతి




## కేన్సర్‌పై అవగాహన పెరగాలి

★ ప్రముఖ బాలీవుడ్ నటి మనీషా కొయిరాలా

కేన్సర్‌పై ప్రజల్లో అవగాహన పెరగాల్సిన అవసరం ఉందని ప్రముఖ బాలీవుడ్ నటి మనీషా కొయిరాలా అన్నారు. ఫిక్కీ లేడీస్ ఆర్గనైజేషన్ (ఎఫ్‌ఎల్‌ఓ), అపోలో కేన్సర్ ఇన్‌స్టిట్యూట్స్, క్యూర్ ఫౌండేషన్ సంయుక్త ఆధ్వర్యంలో 'కేన్సర్ ఈస్ కాంక్వీరబుల్' అన్న అంశంపై నిర్వహించిన కార్యక్రమానికి మనీషా కొయిరాలా హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ తొలి దశలో గుర్తించడం వల్ల వ్యాధి బారి నుంచి బయటపడవచ్చున్నారు. ఈ కార్యక్రమంలో డాక్టర్ విజయానందరెడ్డి మాట్లాడుతూ ప్రపంచ ఆరోగ్య సంస్థ నిబంధనల ప్రకారం 55 శాతం కేన్సర్లు నియంత్రించవచ్చున్నారు.

## పేదల వైద్యానికి 'చికిత్స'

పేదల వైద్యానికి కేంద్ర ప్రభుత్వం ఈ ఏడాది బడ్జెట్‌లో ప్రాధాన్యత ఇచ్చింది. కునారిల్లుతున్న ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థకు జవసత్వాలు కల్పించటంపై ప్రభుత్వం దూరదృష్టిని ప్రదర్శించింది. సరైన చికిత్సకు నోచుకోని పేదలపై ప్రత్యేక శ్రద్ధను కనబరుస్తూ తాజా బడ్జెట్‌లో వైద్యరంగానికి దాదాపు 23శాతం మేరకు కేటాయింపులు పెంచింది. దీర్ఘకాలిక జబ్బుల బాధితుల్లో చాలామంది పేదలే ఉంటున్న నేపథ్యంలో కాలా అజార్, బోదకాలు, కుష్టు, తట్టు, క్షయ వంటి వ్యాధులను నిర్ణీత కాలావధిలోగా నిర్మూలించాలని కంకణం కట్టు కుంది. మాతా, శిశు మరణాలను తగ్గించటం పైనా ప్రత్యేకంగా దృష్టి సారించింది. ఆరోగ్యరంగానికి సంబంధించి తాజా ప్రతిపాదనల్లో 1.5లక్షల ఆరోగ్య ఉప కేంద్రాలను ఆరోగ్య, సంక్షేమ కేంద్రాలుగా మలచటం. నిపుణులైన వైద్యుల కొరతను అధిగమించటానికి ఏటా 5వేల పోస్టు గ్రాడ్యుయేట్ సీట్ల సృష్టి. "వీటిలో వృద్ధుల ఆరోగ్య వివరాలతో కూడిన వీటిని 15 జిల్లాల్లో ప్రయోగాత్మకంగా ప్రవేశపెడతారు. జాతీయ ఆరోగ్య కార్యక్రమానికి అదనంగా రూ.6,369 కోట్లు కేటాయించారు. దీనికి గత బడ్జెట్‌లో రూ.20,762 కోట్లు ఇవ్వగా ఇప్పుడు రూ.27,131 కోట్లు కేటాయించారు. ఆయుష్‌కు రూ.1,428.65 కోట్ల కేటాయించారు. ఇది గత బడ్జెట్ కన్నా రూ.102.45 కోట్లు ఎక్కువ. ప్రజారోగ్యాన్ని కాపాడే ఉద్దేశంతో సిగరెట్లు, బీడీలు, పాన్ మసాలా, నమిలే పొగాకు, పొగాకు జర్దా, గుట్కాలపై ఎక్సైజ్ సుంకం పెంచుతూ బడ్జెట్‌లో ప్రకటించారు. 2016–17లో ఆరోగ్య రంగానికి కేటాయింపులు రూ.38,448 కోట్లు కాగా అది సవరించిన అంచనాలతో రూ.39,879 కోట్లుకు చేరగా తాజా 2017–18 బడ్జెట్‌లో రూ.48,878 కోట్లు కేటాయించారు. ఆరోగ్య రంగంపై మన ప్రభుత్వం జీడీపీలో ఒకటిన్నర శాతం కూడా వెచ్చించడంలేదు. అమెరికాలో జీడీపీలో 17.8 శాతం, యూకేలో 8 శాతం, చైనాలో 3 శాతం వెచ్చిస్తుండగా భారత్‌లో 1.3 శాతం మాత్రమే కావడం గమనార్హం. దేశంలో ప్రతి సంవత్సరం సరైన వైద్యసేవలు అందక సుమారు 10లక్షలమంది మరణిస్తున్నట్లు గణాంకాలు చెబుతున్నాయి. అలాగే ప్రత్యేక వైద్యనిపుణులు సేవలు 70కోట్ల మందికి అందడంలేదు. దేశంలో 70శాతం వైద్యసవేలు ప్రైవేటు రంగంలోనే ఉంటు న్నాయి. వీటిని గుర్తించిన కేంద్ర ప్రభుత్వం ఈఏడాది బడ్జెట్‌లో ఆరోగ్య రంగాన్ని సమూలంగా ప్రక్షాళన చేయాలని నిర్ణయించింది. ప్రపంచంలోనే అతిపెద్ద సార్వత్రిక ఆరోగ్యబీమా కార్యక్రమానికి సంబంధించి ముసాయిదా ప్రణాళికపై కసరత్తు చేపట్టింది.

